దృశ్య జగత్తులో కార్యకారణ నియమంచేత బద్ధుడైన మానవుడిలో ఉన్న వివేకశక్తి, ఆద్యంతరహితుడూ కారణరహితుడూ అయిన దేవుడి చిక్కుముడిని చూసి గాభరాపడుతుంది. మానవుడి వివేకం సృష్టి రహస్యాల్ని ఛేదించలేకపోయినప్పటికీ భగవంతుడే భక్తుడికోసం, ప్రతి రహస్యాన్నీ చివరికి వెల్లడి చేస్తాడు.''

జ్ఞానంకోసం చిత్తశుద్ధితో తపన చెందేవాడు, దైవపథకంలోని ఓనమాలు కొన్ని సవినయంగా సాధనచేస్తూ అన్వేషణ ప్రారంభిస్తాడు; అంతేకాని జీవితంలోని ''ఐన్‌స్టైన్ సిద్ధాంతం'' తాలూకు సునిశిత గణిత రేఖాచిత్రం తనకు కావాలని ముందే కోరడు.

''మానవుడెవడూ (అంటే, కాలం అనే మాయ[1]కు సంబంధించిన సాపేక్షతలు గల మర్త్యుడెవడూ) ఎన్నడూ దేవుణ్ణి చూడలేదు; పరమ పిత హృదయస్థానంలో ఉన్న ఏకైక ఔరసపుత్రుడు (అంటే, ఓంకార స్పందన ద్వారా భౌతిక దృగ్విషయాల్ని అన్నిటినీ నడిపించే ప్రతిబింబిత కూటస్థ చైతన్యం, లేదా బహిర్ముఖంగా ప్రక్షేపించిన పూర్ణసిద్ధ జ్ఞానం, ఏకత్వ వైవిధ్యాన్ని వ్యక్తీకరించడానికి 'హృదయస్థానం' నుంచి

---

అయినా, ఆ దివ్యరాజ్యాన్ని గురించిన జ్ఞానమేదైనా
భద్రపరచుకోడానికి, జ్ఞాపకశక్తిలో ఉన్నంతవరకు
ఈ పాట ముగిసేవరకు నా గానానికి విషయమవుతుంది.''

1. వెలుగులోంచి చీకటిలోకి మళ్ళీ చీకటిలోంచి వెలుగులోకి సాగుతుండే ప్రపంచ దివారాత్ర చక్రం, సృష్టిమాయతో లేదా పరస్పర విరుద్ధ స్థితులతో ముడిపడి ఉన్నదన్న విషయాన్ని ఎప్పుడూ గుర్తుచేస్తూనే ఉంటుంది. (రోజులో సంధికాలాలైన సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాల్ని, ధ్యానానికి శుభప్రదమైనవని అందుకే భావిస్తారు). యోగి, ఈ ద్వంద్వరూపాత్మక ఆవరణాన్ని ఛేదించుకొని అతీంద్రియ ఏకత్వాన్ని దర్శిస్తాడు.

లేదా అస్పృష్టదైవం అగాధాల్లోంచి వెలువరిచినటువంటిది) ఆయన ఉనికిని ప్రకటించాడు" (రూపొందించాడు, లేదా సాక్షాత్కరింపజేశాడు).[1]

"నిజంగా, నిజంగా చెబుతున్నాను మీకు," అంటూ వివరించాడు ఏసుక్రీస్తు, "తండ్రి చేస్తుండగా చూస్తున్నది తప్ప కొడుకు తనంతట తాను ఏమీ చెయ్యలేడు; ఆయన చేసేది ఏదయినాసరే కొడుక్కు కూడా చేస్తాడు (కనక)."[2]

దృగ్విషయిక లోకాల్లో దేవుడు తనంతట తానుగా ప్రదర్శించే త్రిగుణాత్మక ప్రకృతిని హిందూ పవిత్ర గ్రంథాల్లో ప్రతీకాత్మకంగా చెప్పడం జరిగింది— సృష్టికర్తగా బ్రహ్మ, స్థితికారకుడుగా విష్ణువు, లయ కారకుడుగా శివుడు. ఈ మూర్తిత్రయం కార్యకలాపాలు స్పందనశీల సృష్టి అంతటా అనంతంగా ప్రకటితమవుతూనే ఉన్నాయి. కేవల పర బ్రహ్మ మానవుడి మనోగోచర శక్తులకు అతీతమైంది కనక, నైష్ఠిక హిందువు ఆయన్ని త్రిమూర్తుల పావనరూపాల్లో ఆరాధిస్తాడు.[3]

అయితే భగవంతుడి విశ్వ సృష్టి - స్థితి - లయ కారక స్వరూపం ఆయన పరమావస్థ కాని, కనీసం ఆయన మూలప్రకృతికాని కాదు (ఎంచే

---

1. యోహాను 1 : 18.

2. యోహాను 5 : 19 (బైబిలు).

3. 'సత్, తత్, ఓం' లేదా, పిత, పుత్రుడు, పరిశుద్ధాత్మ అనే త్రయ రూప సత్యానికి భిన్నమైన భావన ఇది. బ్రహ్మ - విష్ణు - శివులు పరమేశ్వరుడి త్రయభావాన్ని- స్పందనశీలమైన సృష్టిలో అంతర్నిహితమైన ఉన్న కూటస్థ చైతన్యమనే 'తత్'ను లేదా, పుత్రుణ్ణి సూచిస్తారు. త్రిమూర్తుల "భార్యలు"గా చెప్పే 'శక్తులు', స్పందన ద్వారా విశ్వాన్ని నిలిపే ఏకైక మూలకారణ శక్తి అయిన 'ఓం'కారానికి లేదా, పరిశుద్ధాత్మకు సంకేతాలు.

తండే, సృష్టి అన్నది ఆయన లీల, సృజనశీల క్రీడ).[1] నియమబద్ధమైన అణుప్రవాహంలో వ్యక్తమయిన ఆయన బాహ్యప్రకృతి, ఆయన్ని బయల్పరచకుండా కేవలం వ్యక్తీకరించడం మట్టుకే చేస్తుంది కనక, త్రిమూర్తుల రహస్యాలనన్నిటినీ గ్రహించినప్పటికీ కూడా, ఆయన అంతర్నిగూఢ మూలస్వరూపాన్ని అవగాహన చేసుకోడం సాధ్యం కాదు. "కొడుకు తండ్రి దగ్గరికి చేరినప్పుడే"[2] ఈశ్వరుడి చరమ ప్రకృతి తెలుస్తుంది. విముక్త మానవుడు స్పందనశీల లోకాల్ని అధిగమించి స్పందన రహిత మూలతత్త్వంలోకి ప్రవేశిస్తాడు.

పరమ రహస్యాల్ని వెల్లడిచెయ్యమని కోరినప్పుడు గొప్ప ప్రవక్తలందరూ మౌనం వహించారు. "సత్యమంటే ఏమిటి?" అని పిలేట్ అడిగినప్పుడు, క్రీస్తు జవాబు చెప్పలేదు. పిలేట్ లాంటి బుద్ధివాదులు ఆడంబరంగా వేసే పెద్దపెద్ద ప్రశ్నలు, తీవ్రమైన జిజ్ఞాసతో వేసినవి కావడం అరుదు. అలాటి వ్యక్తులు సాధారణంగా, ఆధ్యాత్మికమైన విలువల[3] గురించి దృఢవిశ్వాసం లేకపోవడమన్నది "నిష్కపట మన సత్త్వానికి" గుర్తుగా పనికిమాలిన పొగరుబోతుతనంతో మాట్లాడుతూ ఉంటారు.

"సత్యానికి సాక్షిని కావాలన్న ధ్యేయంతోనే నేను పుట్టాను; ఈ

1. "ఓ ప్రభూ... అన్నిటినీ నువ్వు సృష్టించావు; అవన్నీ నీ ఆనందం కోసం సృష్టి అవుతున్నాయి." - రివలేషన్ 4 : 11 (బైబిలు).

2. యోహాను 14 : 12.

3. "మంచిని ప్రేమించు; అదొక్కటే స్వేచ్ఛగా ఉన్నది;
అదే నేర్పగలదు నీకు, ఎలా పైకి పోవాలో
తరంగిత ఘంటానాదం కన్న పైకి;
ఆ మంచే నీరసమై ఉంటే,
స్వర్గమే దానికోసం కిందికి వంగుతుంది." - మిల్టన్, "కోమస్"

కారణంవల్లే నే నీ లోకంలోకి వచ్చాను. సత్యానికి కట్టుబడ్డ ప్రతివాదూ నా స్వరం వింటాడు."[1] ఈ మాటల్లో క్రీస్తు ఎంతెంతో ఇమిడ్చి చెప్పాడు. దేవుడి పుత్రుడు కేవలం 'తన జీవితం'వల్ల "సాక్షిగా నిలుస్తాడు." అతడు సత్యరూపుడవుతాడు; అతడు దాన్ని కూడా వివరించడానికి పూనుకుంటే, అది ఉదారంగా చేసిన అత్యుక్తి అవుతుంది.

సత్యమన్నది ఒక సిద్ధాంతం కాదు, తత్త్వశాస్త్రంలో ఉన్న చింతనా విధానం కాదు, బుద్ధిపరమైన అంతర్‌జ్ఞానమూ కాదు. సత్యమనేది, వాస్తవానికి కచ్చితమైన అనురూపం. మానవుడి దృష్టిలో, సత్యం, ఆత్మరూపమైన తన వాస్తవ ప్రకృతిని గురించిన అచంచల జ్ఞానం. ఏసుక్రీస్తు, తన జీవితంలో ప్రతి చర్య ద్వారా, ప్రతి మాట ద్వారా, తన అస్తిత్వ సత్యాన్ని ఈశ్వరుడే తనకు మూలమన్న సంగతి మనకు తెలుసునని నిరూపించాడు. తనను సర్వవ్యాప్తమైన కూటస్థ చైతన్యంగా పూర్తిగా గుర్తించుకొన్న అతడు, సులువుగా తుదిపలుకుగా ఇలా చెప్పాడు; "సత్యానికి కట్టుబడ్డ ప్రతివాదూ నా స్వరం వింటాడు," అని.

బుద్ధుడు కూడా అధిభౌతిక పరమతత్త్వాల్ని వివరించడానికి నిరాకరించాడు; భూమిమీద మానవుడికున్న కొద్ది క్షణాలనూ, నైతిక ప్రకృతిలో పరిపూర్ణత సాధించడానికి వినియోగించడం మంచిదని పొడి మాటల్లో చెప్పాడు. చైనాదేశపు మార్మికుడు లావో-ట్జు సరిగా చెప్పాడు. "తెలిసినవాడు దాన్ని చెప్పడు; చెప్పినవాడికి అది తెలిసి ఉండదు." భగవంతుడి చరమరహస్యాలు "చర్చకు పెట్టడానికి వీలయిన" విషయాలు కావు. ఆయన గూఢ సంకేతలిపిని అర్థంచేసుకోడమన్నది, మనిషి మరో మనిషికి నేర్పలేని కళ; ఇక్కడ దేవుడొక్కడే గురువు.

---

1. యోహాను 18 : 37 (బైబిలు).

"నిశ్చలంగా ఉండి, నేను దేవుణ్ణని తెలుసుకో."[1] ఈశ్వరుడి సర్వవ్యాపిత్వాన్ని ఎన్నడూ కాదనకుండా, ఆయన పలుకులను గంభీర మౌన స్థితుల్లోనే మనం వినగలం. సృజనాత్మక ఓంకార స్పందన విశ్వమంతటా ప్రతిధ్వనించే ఆది నాదబ్రహ్మం. తనతో అనుసంధానం పొందిఉన్న భక్తుడికోసం, గ్రహణానుకూలమయిన పదాలుగా, అప్పటికప్పుడు మార్పు చెందుతుంది.

మానవ హేతుబుద్ధి గ్రహించుకోగలిగినంతవరకు, సృష్టికి గల దివ్యప్రయోజనాన్ని వేదాల్లో వివరించడం జరిగింది. ప్రతి మనిషీ ఆత్మగా, భగవంతుడు సృష్టించినవాడేననీ, ఆ ఆత్మ తన కేవల వ్యక్తిత్వాన్ని తిరిగి పొందేముందు, అనంతత్వానికున్న ఒకానొక ప్రత్యేక లక్షణాన్ని విశిష్టంగా అభివ్యక్తం చేస్తుందనీ ఋషులు చెప్పారు. ఆ విధంగా దివ్య వ్యక్తిత్వానికి సంబంధించిన ఒక యథార్థం ప్రాప్తించిన మానవులందరూ దేవుడికి సమాన ప్రీతిపాత్రులు.

ప్రపంచదేశాలకు పెద్దన్న అయిన భారతదేశం ప్రోదిచేసుకున్న జ్ఞానం సర్వమానవాళికీ చెందే వారసత్వం. యావత్ సత్యం లాగే వైదిక సత్యం, భగవంతుడిదే కాని, భారతదేశానిది కాదు. వేదాల దివ్యగంభీర సత్యాల్ని గ్రహించుకోగల పరిశుద్ధ పాత్రలవంటి మనస్సులుగల మహా ఋషులు, ఈ భూమిమీద పుట్టిన మానవజాతి సభ్యులేకాని, సర్వమానవాళికి సేవచేయడానికి మరో లోకంలో ఎక్కడో పుట్టినవాళ్ళేమీ కారు. సత్యనిష్ఠమైన లోకంలో జాతినిబట్టి కాని, దేశాన్నిబట్టి కాని చూపించే భేద భావాలు అర్థంలేనివి; అక్కడ కావలసిన ఏకైక యోగ్యత, దాన్ని అందుకోడానికి ఆధ్యాత్మిక అర్హత మాత్రమే.

దేవుడంటే ప్రేమ; సృష్టికి ఆయన నిర్ణయించిన ప్రణాళిక ప్రేమ

1. సామ్స్ 46 : 10 (బైబిలు).

లోనే పొదుకోగలదు. ఆ చిన్న ఆలోచన, పాండిత్యమండితమైన తర్క వితర్కాలకన్న ఎక్కువగా మానవ హృదయానికి ఊరట కలిగించడం లేదూ ? ప్రతి సాధువూ సత్యగర్భంలోకి చొచ్చుకుపోయి దివ్యమైన విశ్వ ప్రణాళిక ఒకటి ఉంటుందనీ అది సుందరమైనదనీ ఆనందమయమయినదీ ధ్రువపరుస్తాడు. దేవుడు తన ఉద్దేశాల్ని యెషయా ప్రవక్తకు ఈ మాటల్లో చెప్పాడు :

"నా నోటినుంచి వెలువడ్డ మాట (సృజనాత్మకమైన ఓంకార నాదం) నా దగ్గరికి వృథాగా తిరిగి రాదు ; నేను ఆశించినది చేస్తుందది. నేను దాన్ని దేంట్లోకి పంపితే, అది వర్ధిల్లుతుంది. అతడు ఆనందంగా బయటికి వెళ్తాడు. అతన్ని శాంతితో ముందుకు నడిపించడం జరుగుతుంది. కొండలూ గుట్టలూ నీ ముందు విరిగిపడుతూ గానం చేస్తాయి ; భూమి మీది చెట్లన్నీ చప్పట్లు కొడతాయి."[1]

"నువ్వు ఆనందంగా బయటికి వెళ్ళాలి ; నిన్ను శాంతితో ముందుకు నడిపించడం జరుగుతుంది." కష్టజీవులైన ఇరవయ్యో శతాబ్ది మనుషులు ఆ అద్భుత వాగ్దానాన్ని ప్రగాఢమైన ఆకాంక్షతో వింటారు. దాంట్లో ఉన్న సంపూర్ణ సత్యం, దివ్య ఔరసత్వాన్ని తిరిగి స్వాధీనంలోకి తెచ్చుకో డానికి దృఢసంకల్పంతో శ్రమించే ప్రతి దైవభక్తుడూ సాక్షాత్కరింప జేసుకోగలిగింది.

ప్రాచ్యపాశ్చాత్యదేశాల్లో క్రియాయోగం నిర్వహించే పాత్ర ఇప్పు డిప్పుడే మొదలయింది. మానవ దైన్యాన్ని అంతనూ జయించడానికి నిర్దిష్టమైన, శాస్త్రీయమైన ఆత్మసాక్షాత్కార సాధన ప్రక్రియ ఒకటి ఉందని మానవులందరూ తెలుసుకోవాలి !

---

1. యెషయా 55 : 12.

ధగధగ మెరిసే రత్నాల మాదిరిగా భూమి అంతటా వ్యాపించి ఉన్న వేలాది మంది క్రియాయోగులకు ప్రేమపూర్వకమైన భావతరంగాల్ని ప్రసారం చేస్తూ, కృతజ్ఞతతో నేను తరచు అనుకుంటూ ఉంటాను :

"ఈశ్వరా, ఈ సన్యాసికి పెద్ద సంసార మిచ్చావుకదయ్యా!"

# పదసూచిక

## అ

## ఆ

## ఇ



## ఈ



## ఉ

ఋ



ఎ

ఐ



ఒ



క

## గ

## ఘ



## చ



## ఛ

## జ

ట



డ

## త



## థ

## ద

## న

## బ

## భ

## మ

## య

## ర

శ

ష



స